

శ్రీ రామాయ నమః

# శ్రీ వీరాంజనేయ దండకము



శ్రీరాము పాదాంబుజధ్యాన పారీణ! సద్భక్త మందార! సత్కీర్తి మాహార! ఘోరారి సంహార! శ్రీరామపుత్రాభ కేసరి గాత్రాభ సద్భక్తి యుక్తాత్మ దానవదైత్య తైత్తిల సత్పద్మ నేత్రా పవిత్రా సునృత్తామహారౌద్ర రూపా నవదీప్తప్రతాపా! త్వదీయ ప్రభావంబు! వర్ణింప నే నెంత నా దెంత సన్నాడు నా భారి నా నేర్పు చందాన నిన్నోలి! నీయాదరంబున్ మన్నించి! పూజించెద న…

దండ గాదాల్చి। నావాంఛి తార్థంబు చెల్లన్గటాక్షించి।
నన్బ్రోచి యోకేసరీపుత్ర। బాలుండ వై। బాల భానుస్వలో
కించి। లోకత్రయంబున్భయంబంది కంపింప గామింటికిన్నాటి
యాదిత్యబింబంబు బల్లొద్ద పండంచు ద్రుంగంగ దాయన్మ
హేంద్రుండు వజ్రాహతిన్నిన్ను నొప్పింప గా। మూర్ఛతో
భూమిపై వ్రాలి నన్జూచి నీతండ్రి యామారుతుండల్గి।
సిగ్గొన్చు భూమిస్థ రాంతర్గతంబౌగు వాతంబు నన్నైపి। లో
కంబు నిశ్చేష్టి తాకార మున్బొంద। వాయుప్రచారంబు
లేకుండ బంధించి నంత। న్సురేంద్రాది బృందార కుల్భీతులై
బ్రహ్మతో గూడి యచ్చోటికిన్వచ్చి। నీమూర్ఛ వోద్రుచ్చి।
నీకున్హనూమంతు డన్నామ మున్జేసి। నీకిష్ట తంబుల్వ
రంబుల్ప్రసన్నేసి నీతండ్రి కిన్సంత సంబున్ద గన్జూపి।
లోకంబు ప్రాణంబు రక్షించి। వారేగ సన్నాకపుర్కేరి।
సంప్రాప్త విద్యాప్రవీణుండ వై। కొంత కాలంబు। నీయిష్ట
మాకీర్తి గాగాల మున్బుచ్చి। యావాలి సుగ్రీవులున్నట్టి
కిష్కింధ కున్జేరి యున్వాలి కిన్మంత్రి గానుండ। నవ్వాలి
చేనొచ్చి సుగ్రీవు। డాఋశ్య మూకంబు జేరంగ। నీవున్న

గన్వాలి కిన్బుద్ధు లున్జెప్పి సాన్నిహిత్య మున్జేయ కవ్వాలి। నీనీతు
లన్బ్రోక యుండగ్రా మంబంచు సుగ్రీవు నిన్జేరి। యారాఘ
వుల్సర్వ లోకైక నిర్ణేత కై సీత కై కాన సంచార యా
త్రాంగ। నబ్జాను వంశోత్త మున్భాను పుత్రున్న యావేశ
మారీతి గావించి। యున్వాలి కిన్సఖ్య మున్గూర్చి। కిష్కింధ
సుగ్రీవు నేలంగ జేయించి। శ్రీరాము కార్యార్థి వై యుంగ
రంబాన వాలంది। వేజాంబ వంతాంగ దాదుల్ల గన్గొల్ల।
వైదేహి జాడన్వ చారించు చున్దక్షి ణాశన్న ముద్రంబు
జేరన్జ సాన్రాప ణుంజాము పాదేవి నిన్దెచ్చి। యాలంక
లోనుంచి నాడంచు సంపాతి దెల్పంగ। నమ్మాట పాటించి।
యువ్వాన రాళిన్ది గన్దించి। వారాశి లంఘించి। యాలంక
గన్పించి। యారాక్ష సానీక మున్కన్ను రంగించి। యాజాన
కిన్గాంచి। శ్రీరాము నిజమంబు విన్పించి। యాయుంగ రం
బాన వారిచ్చి। యాదేవ మెప్పించి। చూడామ ణిన్వాన
వాలంది। యాదాన వృద్ధిను లైకోన లన్మార గర్జించు
చున్నిర్జ రారాతి ప్రేమించునయ్యాంతి కోద్యాన వాటిన్ని
మేషంబు లోబీక। యావృక్ష సంతాన మున్నేల పాలేః

గామగ్గు సూచంబు గా బాది। వాలంబు నన్నొత్తిది। తద్రక్త
మున్మాంస మున్నోలి యాభూత భేతాళ తండంబు లు
గ్గాను లుగ్గద్ద లుగ్గుక్కు లున్నక్కు లున్నంత సంబంద గా
జేసి। బ్రహ్మాస్త్ర బద్ధుండ వై।దాన వుల్గట్టి గొంపోవ
గా।లోక విద్రావణుండైన యారావణున్గాంచి। నీతుల్ప్ర
బోధించి శక్రారి సేంద్రుండు గాలాగ్ని చందంబు నన్నుం
డి। ఇవ్వాన దుర్వోక గాల్పించి పంపుండ టన్న।న్ను రాదు
ల్గ మాగ్గాడి। లాంగూల ముజ్జీర్ణ వస్త్రాంబు లజ్జుట్టి।
తైలంబు నన్నట్టి కాల్పించి తద్వ్యధు లద్దిప్ప చుండ।న్న
కీరాంబు వాగుష్ట మాత్రంబు గావించి। యాకట్ల। పోడించి
మైనెంచి। యందున్న రాత్రించ రాసీక మున్దాసి। వైవ
వన్య తీష్ణ్వర గా జేసి। బల్మెప్ప లుస్నిద్ర లుగ్గోపు రంబుల్ల
ధాబుల్ల దాబుల్హ యంబుల్ని వేశించు శాలల్ధ నుశ్శాల
లున్లోను గాగల్గు వేశ్మంబు లెల్లగ్ర మంబొప్ప వాలాగ్ని
చేగాల్చి। యాకుంభ కర్ణాది రాత్రించ రానీక గేహంబు
లెల్లన్ని మేషంబు లోవన్ని కల్పించి యారుద్రు డో।గేశ
వుండో।సు రత్యేష్టు డో।దేరి చూడంగ రాదంచు నదా

నానాథ శక్యంబె। నీనామ మంత్రంబు। నీదండ కంబున్ప్ర
గింపంగ। యూశాకినీ। ఢాకినీ। కామినీ మోహినీ నీబ్రహ్మ
గణస్సు లున్నంపు భూతప్రే యోగాదు లున్నాయ మై
పోవు గాదేని మారాత్మజా * నేను కౌండిన్య సన్మౌని
గోత్రుండ। నాపల్లవాసి సుస్థానోత్తమంబైన। పెల్లూరి
నద్వంశ జాతుండ। శ్రీ అప్పయామాత్య పౌత్రుండ
వేంకటప్పప్రధానార్య పుత్రుండ। శ్రీ చిన్న వెంకప్ప
లామాత్య మామామ సోదర సింహస్య నద్దాన దాసుండ
శ్రీ వేంకటాసుబ్బరాయాభిధానుండ నా * నన్ను నాదార
పుత్రాది మద్రక్త సంబంధు లన్పంఘు లస్మన్మిత్రు లన్బ్రోచు
చున్నాత ఫేతాళ పైశాచ సంఘంబు చేమూకు టుంబా
వాంగిల్లు పీడల్ని వారించి రక్షింపు చు। నేవా జాడ్యంబు
లెల్లన్ని వారించి। మవైన్యేరి వర్గంబు లన్నుండా లన్నిండి
సాహార మున్నేసినా నీవి తబ్బాయు రారోగ్య సంతాన
సంపత్తి నాధిక్య మై। శాశ్వ తైశ్వర్య సంవాప్తి మైవై
భ వ్రాపిత మై। యుల్లసిల్లంగ నాకిమ్ము వ్యాఘాత్య తిస్థాల్పి
భోగింపంగ దేవా సరి। మాతల్లి స్థిరమ్ నా తాతవు నీ —

భ్రాంతులన్ని బాసి నీకంటె వేరొక్క దైవంబు లేదంచు నిక్కం
బు గానీదు పాదాబ్జ ముల్నమ్మి శ్రీ ఆంజనేయ దీవు(తౌ|
శ్రీరాము పాదాంబు జధ్యాన పారీణు గావింది| మత్సం
చితాఘంబు నిశ్శేష మైనాశ మైపోవ గాజేసి| మన్నిం
పు మాదేవ నాకోర్కెలీడున్న నీ వా రఘూరాము పాదా
బ్జ ములద్దప్పి వల్లాను| సంగ్రామ వీరాంజ నేయా| మఱీ
యాత్మ గేహాప్ర పంచాన మాయా|అనబ్రహ్మ వు
ర్యాంజ నేయాన మస్తేన మస్తేనమః

సంపూర్ణము.

మరా:— 7 పేజిలో పైపేనువచ్చిన * * రెండుగుర్తుల మధ్యనుండు గోత్రనామములు వదలి చదువ వలయును.

